# హృదయ నేత్రం

(కవితా కావ్యం)


రచన

**డా॥ వాసా ప్రభావతి**

రీడర్ & హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్

తెలుగు శాఖ

వనితా మహా విద్యాలయ

ఎగ్జిబిషన్ గ్రౌండ్స్, హైదరాబాదు.



**వాసా ప్రచురణలు**

**మలక్‌పేట, హైదరాబాదు.**

హృదయ నేత్రం (కవితాకావ్యం)

ఆగష్టు - 1994

**వెల : రూ. 20/-**

ముఖచిత్రం : **శీలా వీర్రాజు గారు**

ప్రతులకు :
**వి. వి. మాధవి,**
వాసా నిలయం,
11/2 RT, మున్సిల్ కాలనీ,
మలక్‌పేట, హైదరాబాదు - 500 036.

ప్రతులకు :
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన భవనం, బ్యాంక్ స్ట్రీట్,
కోఠి, హైదరాబాదు.

**నవయుగ బుక్ హౌస్**
సుల్తాన్‌బజార్, హైదరాబాదు.

**నవోదయ బుక్ హౌస్**
ఆర్యసమాజ్ మందిరం ఎదురుగా,
బడీచౌడీ, హైదరాబాదు.

ముద్రణ :
**శబరి ప్రింటర్స్**
చప్పల్ బజార్, హైదరాబాదు.

ముఖపత్ర ముద్రణ :
**శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్**
చిక్కడపల్లి, హైదరాబాదు - 20.

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
ప్రొఫెసర్ సెంట్రల్ యూనివర్సిటీ
హైదరాబాదు

# విహంగ వీక్షణం

"కవి ఒక సిపాయిదండు
కలం ఒక తుపాకి గుండు।"

ఈ మాటలు ఉగ్రవాదియైన కవి ఎవరైనా అని ఉంటవచ్చునని అనిపిస్తుంది విన్నవారికి.కాని కవయిత్రి డా॥ వాసా ప్రభావతిగారి కవితాచరణాలివి. కవయిత్రిలో కదను త్రొక్కుతున్న చైతన్య పతాకల్లా ఉన్నాయి ఈ కవితాభివ్యక్తులు. ఆమె వాడిన రూపకం విలక్షణమైనది. ఆమెలో పొంగులువారుతున్న జాతీయతను వ్యక్తంచేస్తున్నది। సిపాయిదండు అనే మెటఫర్ మనకు భారత స్వాతంత్ర్యంకోసం మొదటిసారి బ్రిటిష్‌పాలనపై తిరుగుబాటు ప్రకటించిన సిపాయి పితూరిని జ్ఞాపకం తెప్పిస్తుంది. డాక్టర్ వాసా ప్రభావతిగారు వస్తుతః జాతీయభావస్పృహ ఉన్నవారు దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా సాంస్కృతికంగా, ఆర్థికంగా, సామాజికంగా, సాహిత్యపరంగా భారతీయులను పట్టిపీడిస్తున్న వివిధ విజాతీయ భావజాలాలనుండి జాతివిముక్తంకావాలని గాఢంగా వాంఛించే కవయిత్రి. విజాతీయ భావజాలాలపై రచయిత్రికున్నకసిని వాటిని వెంటనే దూరం చేసుకోవాలన్న ఆసక్తిని, దాన్ని తన కవితతో జాతికి ప్రబోధించాలన్న చైతన్యదీప్తిని 'కలం ఒక తుపాకిగుండు' అన్నరూపకంలో వ్యక్తీకరించారు. ఈ రెండు చరణాలు చదవంగానే మరలా ఎక్కడో స్వాతంత్ర్య సంగ్రామం మొదలయిన చప్పుడు మనగుండెల్లో వినపడుతుంది. అది ఒక రచయిత్రి తెస్తున్న తిరుగుబాటు పోరాటంగా స్ఫురించి మనలను ఆశ్చర్యంలో ఆనందంలో ముంచేస్తుంది.

డాక్టర్ వాసా ప్రభావతిగారు దాదాపు మూడు దశాబ్దాలకు పైబడి సాహిత్యకృషి చేస్తున్నారు. సాటి తెలుగు అధ్యాపకురాలుగా నేను ఎల్లప్పుడూ ఆమెను గౌరవంగా మర్యాదగా సమాదరిస్తుండేవాడిని. వనితా మహావిద్యాల

యంలో పనిచేసే శ్రీమతి వసుమతిగారు, శ్రీమతి ప్రభావతీగారు నాకుతోబుట్టువుల్లాంటివారు. దశాబ్దాలు దొర్లిపోయినా మా సోదర సోదరీ ప్రేమ మాత్రం వసివాడలేదు. డాక్టర్ వాసా ప్రభావతిగారు తమ రచనలనన్నింటినీ ఆప్యాయంగా అందించేవారు మందహాసంతో తమబాటలో తాము నడచిపోతూనే ఉన్నారు. ఆమె గాంభీర్యమే ఆమెగౌరవం.

కవిలో ముందు ద్రష్ట తలయెత్తుతాడనీ, ఆ తరువాత స్రష్టకలమెత్తుతాడనీ సాహితీబంధువులకందరికీ తెలుసు. అయితే ఒక రచయితలో ద్రష్ట బలంగా ఉండి స్రష్ట ఆద్రష్టను అనుసరిస్తున్నట్లుండవచ్చు మరొక రచయితలో స్రష్టలో ద్రష్ట అంతర్భవించినట్లుండవచ్చు. మొదటి రచయితలో తాను చూచింది. భావించింది చెప్పాలన్న స్పృహ ఎక్కువ, రెండవ రచయితలో తాను చెప్పే పద్ధతిలో చెప్పేదానినంతా ధ్వనింపజేయాలన్న స్పృహ ఎక్కువ. డాక్టర్ వాసా ప్రభావతిగారు మొదటి తెగకు చెందిన కవయిత్రి అందుకే ఈ కావ్య సంపుటికి "హృదయనేత్రం" అన్న పేరు ఉచితంగా కుదిరింది.

"ఓ నా కవిత్వమా!
ఓ నా భావస్వప్నమా!
ఓ నా హృదయ నేత్రమా!"

అని స్వీయకవితను సంబోధిస్తూ వ్రాసిన కవితాఖండికల సంపుటి ఇది. కవయిత్రి తనజీవితంలో ఎన్నో అనుభవాలను, సన్నివేశాలను, పరిస్థితులను, సంఘర్షణలను, విలువలను, విశేషాలను చూస్తోంది వాటికి అనుకూలంగానూ, ప్రతికూలంగానూ ప్రతిస్పందిస్తోంది. వాటిని తన కవితద్వారా చెప్పాలని ఆరాటపడుతోంది. ఆ కవిత ఒక భావస్వప్నం, ఒక హృదయనేత్రం అందులో తన ఆశలు ఆశయాలు రమణీయాక్షరరూపంతో అవతరించాలి అని ఆకాంక్షిస్తున్నది. ఆ ఆకాంక్షనే కవితగా ఆవిష్కరిస్తున్నది. ఇది ఒక వ్యక్తావ్యక్తమైన కవితాభివ్యక్తి దశను వ్యంజింపజేస్తున్నది. "హృదయనేత్రం" కవయిత్రియొక్క అట్టిసృజనాత్మక హృదయ స్థితిని వ్యక్తీకరించేవచనకావ్యం.

సామాన్యంగా ఇటువంటి మానసికావస్థకు అభివ్యక్తి సాధనంగా తోడ్పడేది శతకం వంటి ప్రక్రియ అంటే ఏ పద్యానికి అపద్యం ఒక్కొక్క భావఖండికగా ప్రకాశిస్తూ, ప్రతిపద్యంలో ఒక మకుటం పునరావృత్తమౌతూ, ఒక

చిత్తవృత్తి సాతత్యాన్ని ధ్వనింపజేస్తూ, పద్యాలు భావోద్వేగాలుగా ప్రకం పిస్తూ కర్త భావతీవ్రతను ప్రతిధ్వనింపజేయటం శతకలక్షణం. ఆలక్షణాన్ని ఆలవరచుకున్న వచనరచన చేశారు డాక్టర్ ప్రభావతిగారు. పై మూడు సంబుద్ధులూ మకుటంలోని మనోజ్ఞత్వాన్ని ఆవిష్కరిస్తున్నాయి. శతకప్రక్రియ లోని ఆత్మీయతను, ఆత్మాశ్రయత్వాన్నీ, ఆత్మనాయకత్వాన్నీ వరుసగా వ్యక్తీకరిస్తున్నాయి. "హృదయనేత్రం"లోని ఆకర్షణ సంతా ఈ మకుటప్రాయ మైన సంబుద్ధుల సంపుటిలోనే కేంద్రీకృతమై ఉన్నది.

డాక్టర్ వాసా ప్రభావతిగారి ప్రతిభ ఎక్కడ ప్రకాశిస్తోందంటే శతకాన్ని కావ్యంగా మార్చే ప్రయోగం చేయటంలో ఆకావ్యాన్ని కూడా నాటకంగా పఠిత హృదయనేత్రానికి భ్రమింపజేయటంలో. ఇది సాహసంతో కూడిన ప్రయోగమే. ఈ కావ్యానికి ఒక అవతారిక ఉంది. ఒక ఉపసంహార ముంది. అవతారికలో నాందీ ప్రస్తావనలను అర్ధ్రంగా జాలువారేటట్లు ప్రవ హింపజేశారు గోదావరీ తరంగవీచికల్లా. ఉపసంహారంలో సర్వలోకహితాన్ని కోరుతూ భరతవాక్యాన్ని ధ్వనింపజేశారు. లోపల అధ్యాయాలు దృశ్యాలుగా అవతరించాయి. ఇది నాటకంకాదు కదా దృశ్యాలేమిటి? అన్నప్రశ్న వెలువడ వచ్చు కాని హృదయనేత్రం చూచిందల్లా దృశ్యమే. పఠితహృదయనేత్రంతో చూపించేదల్లా దృశ్యమే. సహజశ్లేషను సంవిధానం చేయగల ప్రతిభాశక్తిని భావనం చేసినట్లు కనపడుతుంది కావ్యనిర్మాణమర్మశిల్పంలో.

డాక్టర్ వాసా ప్రభావతిగారి దృక్పథం ప్రధానంగా సమాజాన్ని భావ సంస్కారం ద్వారా సంస్కరించాలని కోరేదే. సాయుధ విప్లవం ద్వారా సమసమాజాన్ని స్థాపిద్దామని సాహసించేది కాదు. హింసకంటె హితవే సమాజా నికి శ్రేయస్సును అభ్యుదయాన్ని కలిగిస్తుందని కవయిత్రి వాంచిస్తోంది. గాంధేయమైన ఆమెవాదం శాంతివిప్లవాన్ని కోరుతోంది. ఆమె "హృదయ నేత్రం" దానికోసం ముందుకు చూస్తోంది. అందుకు ముందుగా మనందరం ఆహ్వానం పలుకుదాం!

వల్లెపట్టుల్లలో పుట్టి పట్టణాలకు ఎగబ్రాకి స్థానీయతకు దూరమై, పట్నంలో ఆత్మీయత కుదరక పరాయీకరణతో పరితపించే నేటితరం గుండె తన్నిటిని హృదయనేత్రంలో నింపుకున్న ఆర్ధ్రమైన కవిత ఈ కావ్య తీపి

తానికి ప్రాతిపదిక. ప్రకృతి మీద కవయిత్రి చూపే సహజమైన ప్రణయం, పుట్టిన గడ్డలోని మట్టివాసన బ్రతుకుబాటలో గుబాళించటం, అడుగడుగునా ఆత్మీయతను ఆవిష్కరించే స్మృతుల సంగతులు సారించటం ఈ కవితలోని వస్తువయి.

"నావూరు మట్టి పుంతలలో
నేను నడిచిన
నా అడుగుజాడల గుర్తులే
నా తలపులలో మెరిసే
విలువైన జ్ఞాపికలు" (పు 18)

ఈస్థానీయత ఈ కావ్యానికి మూలాధారం. స్థానీయతనుండి ఆత్మీయ తను పెంచుకొన్న వైనం ఈ మాటల్లో చూడవచ్చు.

"ఆ రైతులకష్టంతో
ఈ దేశం పెరుగుతోంది
ఆ రైతుల బ్రతుకులు మాత్రం
ఇంకా గుడిసెలలోనే వేలాడుతున్నాయి" (పు. 20)
"కాలం కౌగిలిలో పూసే
వెలుగు, చీకటి పూలే
జనన మరణాలు
అవి ఆగక సాగే ఊయల ఊపులు"

ఆత్మీయతలో అంతర్దృష్టి. అది జీవితానికి తాత్త్వికభూమిక. ఆ తాత్త్విక నేత్రంతో జీవితానికి మూలమైన బాల్యాన్ని ప్రౌఢ దృష్టితో వ్యాఖ్యానించటం హృదయనేత్రం సారించే ఒక హేల.

జీవితంలో విలువల విలువలు పోయినట్లే భాషాబంధాలలోకూడా అనుబంధాల నియమాలను సడలించింది ఈ కవయిత్రి.

"ఆలోచనా తెరచాపలను ఎత్తి
ఈ విశాల ప్రపంచ సముద్రాన్ని
అవలీలగా దాటాలని
ప్రయత్నించేవాడు మనిషి" (పు. 48)

'ఆలోచనా తెరచాపలు', 'ప్రపంచ సముద్రం', స్వేచ్ఛకు చిహ్నాలేమో!

ఆమె హృదయ నేత్రం కాశ్మీరం నుండి కన్యాకుమారిదాకా చూడ గలిగింది. ఈ నేలలోని ఏకవాక్యతను దర్శింపగలిగింది.

"నా చూపులు సింధునది కంటె లోతైనవి
గంగకంటె పొడుగైనవి" (పు. 62)

అని సగర్వంగా చెప్పుకొనే దేశాభిమానం ఆమెకు ఉంది. ఆధునికతలో కూడా ఆత్మీయతను విస్మరించని వివేక నేత్రం ఈ కవయిత్రి హృదయ నేత్రం.

ఈనవ్య వైజ్ఞానిక పథంలో
లైంగిక స్వేచ్ఛే సర్వస్వేచ్ఛలకు
మూలాధారమైతే
ఈ పెరుగుతున్న నాగరికత
పరిమళించే సంస్కార భాండాగారం
తలదాచుకోడానికి తావెక్కడ?
సమాజమంటే పశువులసంతలు కావు
మహిళలంటే మట్టిముద్దల పిడకలు కారు
పెనవేసిన అభిమానాలు
అల్లుకున్న ఆత్మీయతలు"

అల్లుకున్న ఆత్మీయతలకు చిల్లులు పడకుండా రక్షించుకుందామని ఆరాటపడే ఆధునిక హృదయనేత్రం ఈకావ్యం.

ఈ కావ్యంలోని కవితలు హృదయమే నేత్రంగా చూచి చెప్పగలవి. నేత్రం వంటి హృదయంతో వివేచించి వివరింపగలవి.

"నా నేత్ర గోళాలనుంచి
దూసుకువచ్చే నా చూపులు
అనుక్షణం ఈ సువిశాల ప్రపంచంలో
స్వేచ్ఛా విహంగాలై
విహరిస్తూనే ఉంటాయి" (పుట 60)

అని కవయిత్రి ప్రకటించింది. స్వేచ్ఛా విహంగాల స్వచ్ఛంద విహారాలు కలకాలం సాహితీ వియత్తలంలో కమనీయంగా సాగాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను. హృదయనేత్రం విప్పి ధైర్యంగా చూస్తున్నందుకు డాక్టర్ వాసా ప్రభావతిగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

హైదరాబాదు
8-10-1094

జి. వి. సుబ్రహ్మణ్యం

# కవితా కావ్యానికి నాంది పలికిన డాక్టర్ వాసా

కాకినాడ, ఆగస్టు 22 : ప్రముఖ రచయిత్రి, కవయిత్రి అయిన డాక్టర్ వాసా ప్రభావతి తెలుగు సాహిత్యంలో కవితా కావ్యం అనే నూతన ప్రక్రియకు శ్రీకారం చుట్టారని ప్రముఖ కవి సాహిత్య విమర్శకుడు అయిన డాక్టర్ మిరియాల రామకృష్ణ పేర్కొన్నారు. హృదయ నేత్రం రచనద్వారా డాక్టర్ వాసా ఈ ఘనతకు దక్కించుకొన్నారని ఆయన తెలిపారు. స్థానిక టి.టి.డి. కల్యాణమంటపంలోని నిన్న "హృదయ నేత్రం" కవితాకావ్యం ఆవిష్కరణ సందర్భంగా జరిగిన సభలో ఆయన గ్రంథ ప్రశస్తి చేశారు.

అవతారిక, ఇతివృత్తం, జీవితచిత్రణ నిర్మాణసౌష్ఠవం ఉపసంహారం మొదలైన లక్షణాలతో అలరారుతున్న దృష్ట్యా ఈ గ్రంథాన్ని కవితాకావ్యం అనడం ఎంతైనా సముచితమని ఆయన అన్నారు. తనకు తెలిసినంతవరకు ఎవరూ తెలుగులో కవితాకావ్యాలు వ్రాయలేదని ఆయన అన్నారు జీవితంలో తాను చూసిన విషయాలపై స్పందనను తనదైన దృక్పథంతో హృదయనేత్రం ద్వారా ఆమె ఆవిష్కరించారని ఆయన అన్నారు. ఈ దృష్ట్యా ఇందులోని విభాగాలను దృశ్యాలు అనే పేరు సార్థక మయిందని ఆయన అభిప్రాయ పడ్డారు. హరివిల్లులోని ఏడురంగులవలె ఈ కావ్యంలోని ఏడుదృశ్యాలలో ఎంతో వైవిధ్యం కానవస్తునదని ఆయన తెలిపారు. బాల్యంలోని ఆత్రేయపురం జీవనానికి, ప్రస్తుత భాగ్యనగర జీవనానికి మధ్యఉన్న అగాధమే ఆమె కవితా వస్తువుగా ఆయన పేర్కొన్నారు ఆమె రచనలో అభ్యుదయపోకడ ఎక్కువగా కానవస్తున్నదని ఆయన చెప్పారు.

గ్రంథాన్ని ప్రముఖ పారిశ్రామిక వేత్త చాంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షుడు దంట్లు సూర్యారావు ఆవిష్కరించారు. తన సోదరుడు డాక్టర్ కె. కృష్ణమూర్తికి ఆమె అంకితం ఇచ్చారు.

ఏమీ తెలియని సామాన్యునికి సైతం అర్థమయ్యే రీతిలో డాక్టర్ వాసా గ్రంథాన్ని వ్రాశారని సూర్యారావు పేర్కొన్నారు. సాహిత్యాభిమాని ఆయన తన సోదరునికి ఈ గ్రంథాన్ని రచయిత్రి అంకితం చేయడం ముదావహమని ఆయన అన్నారు

హృదయనేత్రం గ్రంథంలో రచయిత్రి తన హృదయాన్ని ఆవిష్కరించారని ప్రముఖ సాహిత్యవేత్త డాక్టర్ శివలెంక ప్రకాశరావు పేర్కొన్నారు. ఆమె దృష్టిలో సమాజం ఏవిధంగా ఉన్నదో ఈ గ్రంథం తెలియ

జేస్తుందని ఆయన అన్నారు. ఈ లోకం గురించి పడిన వేదనను చూస్తే ఆమె మానవతా వాదిగా అభివర్ణించక తప్పదని ఆయన అన్నారు. కోనసీమలోనే మళ్ళీ మళ్ళీ పుడతాను అని చెప్పడంద్వారా ఈ ప్రాంతంపై తనకు అభిమానాన్ని వాసా వ్యక్తం చేశారని ఆయన తెలిపారు.

ఏ ప్రక్రియతో వ్రాసినా నిజమైన కవిత్వం శాశ్వతంగా నిలుస్తుందని సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ కవి జానకీజాని పేర్కొన్నారు. వచనాన్ని గణబద్ధం చేసినంత మాత్రాన కవిత్వం కాదని ఆయన అభిప్రాయపడ్డారు.

డాక్టర్ వాసా ప్రభావతిని బహుముఖ ప్రజ్ఞాశాలిగా సభను ప్రారంభించిన డాక్టర్ పి. చిరంజీవినీ కుమారి పేర్కొన్నారు. స్త్రీవాద రచయిత్రుల పరిధిని అధిగమించి డాక్టర్ వాసా స్త్రీల సమస్యలకు కొత్త పరిష్కార మార్గాలను చూపుతున్నారని ఆమె అన్నారు. స్త్రీ దృక్పథంతో వ్రాసిన గ్రంథంగా హృదయ నేత్రాన్ని ఆమె అభివర్ణించారు.

కేవలం కవితా సంకలనాలు మాత్రమేగాక, నవలలు, కథా సంపుటాలు వ్యాస సంపుటాలు వెలువరించడం ద్వారా డాక్టర్ వాసా బహుముఖ సాహిత్య సేవ చేస్తున్నారని ప్రముఖ రచయిత్రి డాక్టర్ ఆలూరి విజయలక్ష్మి పేర్కొన్నారు. స్త్రీవాద కవిత్వంలో తీవ్రవాదా ధోరణిని గాక డాక్టర్ వాసా సమస్యా ధోరణి అనుసరిస్తున్నారని ఆమె అన్నారు

ప్రముఖ జాతీయ నాయకుడు జయప్రకాష్ నారాయణ సతీమణి ప్రభావతి పేరును తద తండ్రి తన సోదరికి పెట్టారని కృతి స్వీకర్త డాక్టర్ కాశీచ యశులు కృష్ణమూర్తి పేర్కొన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో ఒక సారి జయప్రకాష్ దంపతులకు స్వాతంత్ర్య యోధుడైన తన తండ్రి సూర్యనారాయణ ఆతిథ్యం ఇచ్చారని ఆరోజులలో ప్రతిరోజూ నూలువడకే ప్రభావతిని చూసి గాంధేయవాది అయిన తండ్రి మురిసిపోయారని ఆయన వివరించారు. జయప్రకాశ్ సతీమణి అంత స్థాయికి తన కుమార్తె ఎదగాలనే ఆకాంక్షతో ఆమె పేరును తన సోదరికి తమ తండ్రి పెట్టారని ఆయన వివరించారు.

సోషలిస్టు భావాలు కలిగిన జయప్రకాష్‌కు సర్వోదయ మార్గం వైపు నడిపించిన ఘనత సైతం జయప్రకాష్ సతీమణికి దక్కిందని ఆయన చెప్పారు.

చిన్నతనంనుండి సమాజానికి ఏదో ఒక సేవచేయాలనే తనకు ఉండేదని రచయిత్రి డాక్టర్ వాసా ప్రభావతి తెలియజేశారు. కొన్ని విషయాలలో ఆవేశాన్ని ప్రదర్శించడం కూడా తప్పనిసరి కాగలదని ఆమె అన్నారు.

(1994 ఆగస్టు 21 సాయంకాలం 6 గం॥లకు కాకినాడలోని గ్రంథావిష్కరణ సందర్భంలో కోస్తా వాణిలో ప్రచురించినది.)

స్వరాజ్య సమరంలో శంఖం పూరించి
హృదయంనిండా దేశభక్తిని నింపుకొని
విశేష ప్రతిభాపాటవాలను వైద్యవృత్తిలో కలిగి
సాహితీ సాంస్కృతిక రంగాలకు పూలదండగా
మంచి మిత్రమండలిలో చంద్రునిలా నిలిచే
అపురూప విజ్ఞానమూర్తి
వివేకసంపన్నుడు
ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధులు
స్వర్గీయ కాశీచయనుల సూర్యనారాయణగారి
ప్రియపుత్రుడు
మా అన్నగారు

**డా॥ కాశీచయనుల కృష్ణమూర్తి గారికి**

ఈ హృదయ నేత్రం కవితాకావ్యాన్ని
కళాభివందనములతో
చిరుకానుకగా సమర్పిస్తున్నాను.

—కవయిత్రి

# కృతజ్ఞతలు

ఎందరో మహాకవులు, అందరికి వందనాలు. నా కవితలు చదివి కవితా కావ్యంగా వెలువడటానికి నన్ను ప్రోత్సహించిన నా అభిమానులకు, నా శ్రేయోభిలాషులకు నా నమస్కారములు.

ఈ కవితా కావ్యం అంకితం తీసుకోటానికి అంగీకరించిన నా అన్నగారు, కాకినాడ నివాసి, దేశభక్తుడు, సాహితీప్రియుడు, సహృదయ మిత్రుడు డా॥ కాశీచయనుల కృష్ణమూర్తిగారికి,

వెనుకనే ఉండి నన్ను ప్రోత్సహించి, ఈ కావ్యావిష్కరణ జరగడానికి కారణభూతులైన మా వదినగారు శ్రీమతి కాశీచయనుల వెంకట మహాలక్ష్మిగారికి,

ముఖచిత్రాన్ని అందంగా చిత్రించి ఇవ్వడమేకాక ఈ గ్రంథానికి ఈ "హృదయనేత్రం" పేరు పెట్టడానికి సలహా ఇచ్చిన ప్రముఖ చిత్రకారులు, సాహితీ బంధువులు శ్రీ శీలా వీర్రాజుగారికి,

సకాలంలో కవరు పేజీ ప్రింటుచేసి ఇచ్చిన బాలాజీ ప్రింటర్స్, చిక్కడపల్లివారికి, సకాలంలో ప్రింటుచేసి ఇచ్చిన శబరి ప్రింటర్స్ వారికి నా కృతజ్ఞతలు.

నా కవితలు చదివి నన్ను ప్రోత్సహించే నా పాఠకలోకం ఈ కవితా కావ్యాన్ని కూడా ఆదరిస్తుందని ఆశిస్తున్నాను.

—కవయిత్రి

# అవతారిక

తూర్పు తెమ్మెరల పల్లకీలలో
నవవధువులా పయనిస్తూ
గోదావరీనదీ తరంగాలపై
చిగురుటాకుల ఊయల లూగుతూ
భూ పురంధ్రీపాద ధూళిరేణువులతో
పసిపాపలా ఆడుకుంటూ
సుప్రభాత సుందర వేళలలో
వెలుగులు జిమ్మే కాంతిరేఖవై
సాయం సంధ్యా పులకింత వేళలో
అనురాగ దీపానివై
నా పాఠకావళి హృదయతంత్రులు మీటుకుంటూ
సాగిపో
ఓ నా కవిత్వమా!
ఓ నా భావ స్వప్నమా!
ఓ నా హృదయ నేత్రమా!

పల్లె పడుచులా స్వేచ్ఛగా
ఈ పచ్చని నేలపై తిరుగలేక
చల్లని పవిత్ర నదీ జలాలను
దోసిళ్ళతో కడుపునిండా గ్రోల లేక
దాహాన్ని తీర్చుకోలేక గతులు తప్పి
ఇనుప గొట్టాల నుండి
చుక్క చుక్కలుగా రాలె
వెచ్చని నీటితో నోరు తడుపుకునే
ఆ నా మనుష్యులను
చల్లని తల్లిలా పలకరించి రావమ్మా!
ఓ నా కవిత్వమా!

చల్లగాలుల స్వేచ్ఛా వీచికలతో
గుండెలు పూరించుకుంటూ,
పచ్చిక బయళ్ళ చావడిలో
పూ పొదరిండ్ల ముంగిళ్ళలో
కాపురపు కోరిక తీరక వాడిపోయి
సందుల్లో గొందుల్లో పూరి గుడిసెల్లో
చిముకు డబ్బాల కప్పుల నీడల్లో
మురికి పంచల్లో నడుం, వాల్చె
నా జనావళికి పూల పందిరివై

నిలిచిపోవమ్మా!
ఓ నా కవిత్వమా!

కోకిల పాటల మాధుర్యాలు జుర్రుకుంటూ
చిలుకల పలుకుల సోయగాలు పీల్చుకుంటూ
వసంతకాల వేకువ వేళల
సౌగంధాలు పులుముకుంటూ
పూవు పూవును మనసార పలకరించె
సీతాకోక సోయగం తలచుకుంటూ
వసంతమే ఎరుగని బతుకుల చెక్కిళ్ళను
కన్నతల్లిలా నిమురుతూ
నిలిచిపోవమ్మా!
ఓ నా కవిత్వమా!

పకపక నవ్వులు నవ్వుకుంటూ
పచ్చని యిళ్ళల్లో చిలుకా గోరింకల్లా
తిరిగె కొత్తదంపతుల
సరాగాలకు కట్నపిశాచం
ఇనుపతెర కాగా
విరహంలో అలమటించె
ఆ నవ దంపతులకు
చంద్రకాంత శిలవై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

నగరాల నడివీధుల్లో
అంతస్తుల భవనాల సోయగాల్లో
వెలిగే దీపాల కాంతుల నీడల్లో
బతుకులు ఈడ్చే చీకటి బతుకులకు
వెన్నెల రాశివై నిలిచిపోవమ్మా!
ఓ నా కవిత్వమా!

మధుర పదార్థాల తీపి బాధలకు
త్రేన్చే ఖరీదు మనుష్యుల కాలికింది
తివాసీలు తుడిచే ఆకలిపొట్టల
ఆక్రందనల ఘోషలకు
ఉద్యమగీతానివై!
విజయ కేతనానివై ఎగురవమ్మా!
ఓ నా కవిత్వమా!

ఎగిరే విమానాల నీలిగగనపు స్వేచ్ఛాపర్వంలో
భాగస్వామ్యం ఎరుగని
నేల బాటలపై
కాలి చెప్పులను పిప్పిచేసుకుంటున్న
గుర్తింపులేని మనుష్యుల నిజాయితీని
కొలిచిరావమ్మా!
ఓ నా కవిత్వమా!

మంచు బిందువుల ముత్యపు గుత్తులతో
ముగ్ధ మనోహరంగా వెలిగే
ఆ గరిక పూవు సోయగంవలె
సమాజపు డాంబికాల ముసుగు మాటున
అణగిఉన్న కళా సౌందర్య మూర్తులకు
దివిటీవై నిలిచిపోవమ్మా!
ఓ నా కవిత్వమా!

కాల్పనిక జగత్తులోకాక
ప్రజలనాడులు కొలుచుకుంటూ
ఒడ్డులు తాకి ప్రవహించె
నిండు గోదావరి సుడిలా
మహాత్ముల చల్లని పలుకులా
అణువణువున ఆత్మవిశ్వాసం
చాటుకుంటూ
అక్షరము మాటున అర్థ సౌరభం
చిమ్ముకుంటూ
నా హృదయసంద్రంలో
ఉదయించే చంద్రునిలా
నా హృదయాద్రిపై ఉదయించే
సూర్యునిలా

చాటు గుసగుసలకు
చేదు నాలుకలకు తలవంచక
పాతాళ గహ్వరాలకు అడుగు ఆపక
విమర్శనాబాణాలను
తోరణాలవలె దాటుకుంటూ
చెలిమి సిరులు పంచుకుంటూ
సాగిపో
ఓ నా కవిత్వమా!
నా భావ స్వప్నమా
ఓ నా హృదయ నేత్రమా!

(ఆకాశవాణి ఎక్స్టర్నల్ సర్వీస్ - న్యూఢిల్లీ సౌజన్యంతో.)

# మొదటి దృశ్యం

కొండల్లో కోనల్లో పుట్టి
భద్రాద్రి సీతారాముల పాద సన్నిధిలో
పర్ణశాలను ముట్టి
ఉత్తుంగ తరంగ విన్యాసంతో
రాజమహేంద్రాన్ని జడ బిళ్ళగా పెట్టి
తెలుగుమాతకు ఏడుపాయల జడగా సాగె
తెలుగుగోదావరితల్లి వెంట
జల విహంగంలా
కంఠాలు సవరిస్తూ
గానాలు చేస్తూ
సాగిపో
ఓ నా కవిత్వమా!

ఆదికవి నన్నయ్య ఆలపించిన
తొలితెలుగు కావ్యసిరులు పంచుకుంటూ
కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవి
పండించిన భీమఖండాది
కావ్యరస సౌందర్యాలు చిమ్ముకుంటూ
రసగంగాధరుని అడుగుజాడల్లో చిందులువేస్తూ
నిత్యం పఠించే పండితుల వేదపాఠాలను
మధురంగా ఘోషిస్తూ
శాస్త్రపాండిత్యచర్చలను
ప్రతిధ్వనిస్తూ
గౌతమ, వశిష్ఠాది మహర్షుల వెంట
కోనసీమలను, కొబ్బరితోటలను మెట్టుకుంటూ
పాడిపంటలు పెంచుకుంటూ
తరతరాల తెలుగుప్రజలకు
పెరటి నదిగా
భరతావనికే జీవనదిగా
కరువుకాటకాలు తలయెత్తని
చల్లని తల్లిలా సాగిపోయే
పవిత్ర గోదావరి ప్రవాహంలో
నాదానివై మంజీరనాదానివై
సాగిపో!
ఓ నా కవిత్వమా!

త్యాగధనులై ఎన్ని మేఘరాసులు
కరిగి కరిగి నీరై వర్షిస్తే
ఈ గోదావరి ఉప్పొంగి ఉరకలు వేస్తూ
కష్టసుఖాలకు తలవంచని
అహంకారినిలా
ముందు వెనుకలు చూడని అజ్ఞానిలా
ఎన్ని ఊళ్ళను ముంచెత్తి
ఎన్ని జీవరాసుల ప్రాణాలను కబళించి
నగ్నంగా నర్తించె వేళలో
ఎన్ని జనవాటికలను
శ్మశానవాటికలు చేస్తుందో
జ్ఞానోదయంతో కళ్ళు తెరచె
తపశ్శాలిలా తిరిగి
పశ్చాత్తాపంతో వెనక్కి-మరలి
కోటికెరటాలతో కోటిపల్లిలో
అంతర్వేది అనంతక్షేత్రాలలో
తూర్పు సంద్రంకౌగిలిలో కరిగె
గోదావరి నురుగుల వెంట నడిచే
ఉదయకిరణ రేఖవోలె
సాగిపో
ఓ నా కవిత్వమా!
ఓ నా భావ స్వప్నమా!
ఓ నా హృదయ నేత్రమా!

ఎన్ని యుగాలు గతించినా
మారని గమ్యంతో
మారని పయనంలో
ఎన్ని సముద్ర తరంగాలు
ఎగసిపడుతూ ముంచెత్తి వచ్చినా
అగ్నిదూకిన సీతామహాసాధ్వి
పవిత్ర చరిత్రలా
ఆ ఉప్పు నీటి కాలుష్యం అంటకుండా
ఆ బురద నీటి వాసన తాకకుండా
పవిత్ర గంగాజల ధారలా
అమృతధారలు కురిపించే
తీయని జలధారలతో
ఊట నీటి ఒడ్డున
నడిచే బాటల్లో
ఎన్ని తీపి చెరకు తోటలు?
ఎన్ని పనస మామిడి తోటలు?
ఎన్ని అమృతపాణీ వరుసలు?
ప్రపంచ చరిత్రకే
మాధుర్యాన్ని నేర్పు ఆ గోదావరి తల్లి చరిత్ర.
ఆమె మెట్టిన నేలలో రాజనాలు పండు.
ఆ పంట భూముల్లో పాలపిట్టలా
పచ్చగా సాగిపో
ఓ నా కవిత్వమా!

వృత్తులకు కొదువ లేదు
మనిషి వృత్తానికి కొదువ లేదు
కష్టపడి పని చేసియైన
కడుపునిండ తినువారెకాని
కరువు కాటకాలతో
అలమటించువారు లేరు.
రాతి నేల కాదిది
రతనాలు పండు నవధాన్య వాటిక యిది.
ఈ సీరు పుక్కిలి పట్టినవాని నోట
కవితాధారలు ఊరకుండునా
ఈ నేల నడచిన వానికి
దేశభక్తి గుండెలలో పూయకుండునా
ఈ దేశానికి వెన్నెముక
ఈ కోస్తా తీరం -
దేశమాత నడుముకు బిగించిన
పదహారు వన్నెల మొలనూలు
ఈ కోస్తా తీరం -
కాటన్ దొర కంటిరేఖలో
తెలుగుతల్లికి పాపిటగా వెలసిన
ధవళేశ్వరం ఆనకట్టల జలధారలో
తీయని జలధారవై
తంబురాలు మీటుకుంటూ
సాగిపో
ఓ నా కవిత్వమా!

సర్వసాహితీ ప్రక్రియలను
కలంపట్టి కదం తొక్కిన
ఆధునిక సాహితీ యుగకర్త
సంఘ దురాచారాలను రూపుమాప
నడుంకట్టిన సమరయోధుడు
పసుపు కుంకుమలు నోచుకోని
పసిపాపల నుదుట
పాపిట నిలిపి వారి జీవితాలను
మూడు పూవ్వులు ఆరు కాయలుగ
పండించిన ఆదర్శమూర్తి
ఆ వీరేశలింగానికి ఆవాసం
వారి అడుగుజాడల్లో నడిచిన
ఆదర్శ నారీమణి రాజ్యలక్ష్మికి
ఆలవాలం ఆ రాజమహేంద్రి.
వందేమాతరమంటూ
చిలకమర్తి పూరించిన
భారత స్వాతంత్ర్య సమరశంఖ నినాదాలు
ప్రతిధ్వనించె ఆ నేలలో
గాంధీమహాత్ముని అడుగుజాడలు
కొలిచె ఆ కోస్తాతీరంలో
విజయశంఖం పూరిస్తూ
సాగిపో
ఓ నా కవిత్వమా!

అతివృష్టి, అనావృష్టులతో
గాలివానల చెంబదెబ్బలతో
వరదల అహంకారాలతో
పాడిపంటలు నేలపాలవుతున్నా
రైతుల బతుకులలో
పండు వెన్నెలలు కురిపించు
కోస్తా తీర మాగాణులు.
పగలూ రాత్రీ అనక
నాగలిని భుజాన్ని తగిలించి
చద్ది అన్నంతో పొట్టలు నింపుకుని
కాడెద్దులు కట్టి పొలాలు దున్నే
ఆ రైతన్నల కండబలంతో
పెరిగె పైరుల పచ్చదనంతో
కూలిజనం చెమటబిందువులతో
పండే పంటల రాసులు
భరతావనికే ధాన్యలక్ష్మిగా
వెలుగొందే కోస్తా తీరంలో
కోనసీమకు జడపాయలుగా పారె
పంటకాలువల్లో
ఎగుమతి దిగుమతులకు మూల రూపాలై
ఎల్లవేళల పయనించే
ఆ పడవల వెంట
జాలరి పాటలా-
జానపద గేయంలా
సాగిపో
ఓ నా కవిత్వమా!

ఒకపక్క పిఠికాపురరి
ఆంధ్ర సాహితీకేతనమై
గురజాడకు సాహిత్యపీఠమై
పూరించిన దేశభక్తి గీతం
స్వతంత్రదేశానికి విప్లవశంఖమై
సంఘదురాచారాల దుమ్ముదులిపిన
వీరఖడ్గం కన్యాశుల్కం
అభం శుభం తెలియని
కన్నెపిల్లల బతుకులకే మేలుకొలుపు
పుత్తడిబొమ్మా పూర్ణమ్మలను
పెంచి పోషించిన పిఠికాపురవధూటితో
చెమ్మచెక్కలాడు
కాకినాడ పురంధ్రి.
సర్వకళలకు ఆవాసమై
కవిగాయక పండితులకు నివాసమై
తెలుగు సాహితిని పెంచి పోషించు
ఆంధ్రభోజుల కనువిందై
భారత స్వాతంత్ర్య సమర యోధులను
కని పెంచిన పవిత్ర భూమియై
నేటి రాజకీయ నాయకులతో
కలకలలాడు కాకినాడ నగరంలో
కవికోకిలవై
సాగిపో
ఓ నా కవిత్వమా!

ఎన్నడూ సరిహద్దులు దాటని
ఉప్పుటేరు కనుసన్నల్లో పెరిగిన
మహాంధ్ర నగరం
తూర్పుగోదావరికే ఆస్థాన నగరం
ఈ కాకినాడ నగరం.
చుట్టూ బంగాళాఖాతం సేవిస్తుంటే
ద్రాక్షారామ భీమేశ్వరుని
కరుణాకటాక్షంతో
అన్నవర స్వామి వరప్రసాదంతో
సిరులు మూటగట్టు నగరం.
పని పాటలు చేసుకొనువారికి
బతుకుల పంట ఈ నగరం.
నది సంద్రంలో కాపురాలు
చేయు జాలరుల జీవిత రేఖలను
ఉప్పెనలు, గాలివానలు
ముందు వెనుకలు చేస్తున్నా
వారి బతుకులపంట ఆ తీరంవెంట
చిరుగాలి కెరటంలా
మురళినాదంలా
సాగిపో
ఓ నా కవిత్వమా!

ఈ కోస్తా ఆంధ్రతీరంలో
పవిత్ర గోదావరీ పులిన స్థలాలో
అడుగులు వేస్తూ ఆటలు ఆడాలని
ఆంధ్రకవితావధూటి కురులు దువ్వి
కావ్యసిరులు ముడవాలని
కలంపట్టి కవితాగాన
మాలపించు నేను
పునర్జన్మలంటూ ఉంటె
మళ్ళీ మళ్ళీ పుడతా
ఆంధ్ర కవయిత్రిగా
ఈ కోస్తా ఆంధ్రతీరంలో
మళ్ళీ మళ్ళీ పుడతా
ఆంధ్ర కవయిత్రిగా.
ఆంధ్ర సాహితీమాతకు అందించె
కవితా హారతులుగా నిలిచిపో
ఓ నా కవిత్వమా!
ఓ నా భావ స్వప్నమా!
ఓ నా హృదయ నేత్రమా!

# నా వూరు

నా వూరు నంటిపెట్టుకుని పారుతూ
ఎన్నడూ ఆ వూరు వదలి రాని
గోదావరి తల్లి తరంగనాదాలె
నా వూరుకు నిత్య మంగళవాయిద్యాలు
నా వూరు పక్కగా గోదావరమ్మ వాలుజడలా
పరుచుకున్న కాలువ పాయల్లో
పడగల్లా కదలె పడవలె
అచ్చట వర్తక వ్యాపారాలకు ప్రతీకలు

నా వూరు గట్ల మీద పచ్చని చెట్లపై
పెరిగిన చిలకా గోరింకల ముద్దు పలుకులె
వచ్చిపోయెవారికి చల్లని పలకరింపులు.

నా వూరు మట్టి పుంతలతో
నేను నడిచిన
నా అడుగుజాడల గుర్తులే
నా తలపులతో మెరిసే
విలువైన జ్ఞాపికలు.

ఆనాడు నాకాలినంటి
నేటికీ ఆరిపోని ఆ బురదమరకలే
నా భవితత్వానికి వెలుగు బాటలు.

ఆ వూరు మధ్యలో మామిడి తోటలో
ఆనందంతో నే ఊగిన ఊయల
మా యింటి ముంగిటిలో
నేనాడిన గోలీల గుంటలు
తరతరాల పిల్లల బాల్యక్రీడలకు
వెచ్చని పొత్తిళ్ళు.

మా పెరటిలో జామచెట్టు కొమ్మనుండి
నేల జారిపడిన నాటి
నా నుదుటి బొప్పిని
తడుముకు చూచినప్పుడు
ఎన్ని బొప్పిలు కడితే
జీవితమవుతుందోనని
తెలియజెప్పె నా అనుభవమే
నా భవితవ్యానికి మేలుకొలుపులు.

నా పల్లెలో నేను ఆడిన
చెమ్మచెక్కలు, కోలాటాలు, గోటీబిళ్ళలు
నేటికీ కొనసాగుతూ
అక్కడి పిల్లల ఆనందానికి
ఆరోగ్యానికి వారసత్వంగా నిలిచాయి.

నే పెరిగిన పెద్దల మమకారాల వొడులే
నేటి పిల్లలకు మమకారాల కొండలు.

పాలనురుగులా స్వచ్ఛంగా ఉండె
అక్కడి స్నేహాలు, బంధుత్వాలు
నేటికీ మచ్చలేని పూర్ణ బింబాలు.

అనురాగపు మధువును చిందించె
ఆ పల్లెవాసుల మాటలె
నేటికి ఎండిపోని ఊటబావులు.

ఆ నదీమతల్లి వడిలో
పెరిగే నిత్య పచ్చదనాలే
ఈ దేశానికి నిత్యాన్నదానాలు.

అ రైతుల కష్టంలో
ఈ దేశం పెరుగుతోంది
ఆ రైతుల బతుకులుమాత్రం
ఇంకా గుడిసెలలోనే వేలాడుతున్నాయి.

అక్కడి జనుల మంచితనం
మంచి గంధంలా దేశమంతా గుబాళిస్తున్నా
వారి బతుకులు మాత్రం
గాలివానలకు, వరదలకు బలి అవుతూ
భయాందోళనలతో బిగుసుకుపోతున్నాయి.

నాకు అడుగులు నేర్పిన నేలతల్లి
నాలో నిత్యం శంఖారవమై ఆలపిస్తోంది.

నాకు అక్షరాలు నేర్పిన ఆ బడి
నా గుండెలలో గుడిగా వెలుగుతోంది.

ఆనాడు అల్లిబిల్లిగా
అల్లుకున్న భావపరంపరలే
ఈనాటి నా గొంతులోని
కవితాధారలు

అయినా నా వూరు ఎక్కడ వుందని?
నా గుండెవాకిటిలో
పరచుకున్న పచ్చదనమే
నా వూరు!

# రెండవ దృశ్యం

ఉదయాద్రి శిఖరమునుండి
సూర్య బింబం బంగరు బింబమై
అడుగుపెట్టే సమయం.
లోకంలో చీకటిని చీల్చుకుంటూ
వెలుగు రేఖల మల్లేపువ్వల్లా
ప్రతి ఉదయం విచ్చుకునే సమయం.
ఈ ధరిత్రిపై మానవ మనుగడకై
ప్రకృతి ఏర్పాటు చేసిన
బంగరు వేడుక యిది.
వెలుగురేఖల్లో మనిషి ముందుకు పయనిస్తే
చుట్టూ ఉన్న సమాజం
ఆ వెలుగును పంచుకుంటూ

మానవత్వపు పరిమళాలు
వెదజల్లుతుంది.
మనిషి గుండెలలో చీకటి నింపుకుని
వెలుగువైపు పయనించాలనుకుంటే
సమాజం పసిగట్టి
నిర్దాక్షిణ్యంగా వెనక్కు తోస్తుంది.

కాలం కౌగిలిలో పూసె
వెలుగు, చీకటి పూలె
జనన మరణాలు
అవి ఆగక సాగె ఊయల ఊపులు.

కాలిఅడుగుల నైజంవలె
ముందు వెనుకలు
మనిషి జీవితాలకు నైజం.
ఈ లోకంలో కొందరు మహాత్ములై
కొందరి జీవితాలకు ఆదర్శమైతే
కొందరు దుష్టాత్ములై
కొందరిని ముంచెత్తుతారు
కొందరు నివురుగప్పిననిప్పులా
మనిషి హృదయాలను
రగిల్చి వినోదిస్తారు.

నిండు హృదయంతో
కాలం అందరి చేతులు కలిపి
చెట్టపట్టాలేసుకు నడుస్తుంటే

అవకాశం కొందరినే వరిస్తుంది.
అవకాశం వచ్చేదాకా ఆదర్శాలు
వేదపాఠాల్లో వర్ణిస్తారు.
అవకాశం చేచిక్కితే
పంజరంలోని చిలకలా అవకాశాన్ని బంధించి
లోకంపై సవారి చేస్తారు.

ధర్మాధర్మాలు చేతులు కలిపి
ఒకే మనిషి హృదయంలో
నాట్యం చేస్తున్నప్పుడు
జీవితపు విలువలనే మార్చివేస్తారు.
నీతుల లోతులన్నీ
లోకంలో కూరుకుపోతే
కొత్త నిర్వచనాలు
సరికొత్త సంబోధనలూ
తలెత్తుతాయి.

లభించే విజయం తాత్కాలికమైన
అందరు చేతులు జోడించి నమస్కరిస్తారు.
అవసరాలు తీర్చుకోడానికి
పొగడ్తల పువ్వులు విసిరి
ఘుమఘుమలాడిస్తారు.
మనిషికి కాదు చేసే పూజలు
పెట్టే దండాలు

మనిషి కూర్చున్న కుర్చీకి.
మనిషికి కాదు గౌరవం
మనిషి చేతిలోని పదవికి.
పదవి కొందరికి అలంకారమయితే
పదవికే కంఠహారాలై
వెగులుతారు కొందరు.

ఏ పదవులు వరించకపోయినా
త్యాగధనులై జనులమధ్యలో
నిలబడుతారెందరో
తరతరాలకు ధనరాసులు సమకూర్చుటకై
అమాయకజనం కళ్ళుకప్పి
దేశాన్నే తాకట్టుపెట్టువారెందరో?

స్వతంత్ర దేశంలో
జనులందరు కళ్ళుతెరచి చూడాలి
జనం గళంవిప్పి పలకాలి
జనం జనం చేతులుకలిపి
అవినీతికి వెయ్యాలి సంకెళ్లు
స్వతంత్ర దేశంలో పౌరునిగా వెలగాలి ప్రతి మనిషి.

# మూడవ దృశ్యం

నులక మంచముపై
పాత బట్టల పొత్తిళ్ళలో
చల్లని ఒడిలో
మెత్తని పలుకులలో
చనుపాలిస్తూ జోకొట్టే
ఆ కన్నతల్లి అనురాగానికి
చల్లనిగొడుగువై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

అందాల గదిలో
పట్టు పాన్పులపై
తల్లి ఒడి సుఖమెరుగక
చనుపాల రుచి తెలియక
దాదుల ఒడిలో పెరిగే
ఆ పసివానికి
అనురాగరేఖవై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

మారిన నాగరికతలో
సంరక్షణాలయాల చావడిలో
ఆకలితో అలమటిస్తూ
కన్నతల్లులకై ఎదురుతెన్నులు చూసె
ఆ పసిపిల్లలను
పిల్లతెమ్మరవై
ఓదార్చి రావమ్మా!
ఓ నా కవిత్వమా!

చదువులు చెప్పే ఓపికలేక
శిక్షణ యిచ్చే శక్తిలేక
బడిపిల్లలను చావమోదే
టీచర్ల హస్తాలనుండి
ఆ పసివారిని రక్షకభటునిలా
కాపాడి రావమ్మా!
ఓ నా కవిత్వమా!

బండరాళ్ళపై పసివానిని పరుండబెట్టి
పొట్టకూటికై మండుటెండలో
నాపరాళ్ళను పగులగొట్టే
ఆ కన్నతల్లి నోటికి
మంచినీటి ధారవై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

పొట్ట చేత పట్టి
మబ్బుతునక రాకకై
ఆకాశంవైపు గాజుకళ్ళతో చూస్తూ
కన్నబిడ్డల ఆకలిపొట్టలవైపు
దీనంగా చూస్తూ
బీడుపడిన పొలాలలో
కాడెద్దులను కట్టి
పొలాలు దున్నే
ఆ రైతుల బతుకులలో
వానచినుకువై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

తెల్లవారకుండగనే
చద్దిఅన్నం చంకనపెట్టి
నోరులేని పశువులను మేపాలని
నదురు బెదురు తెలియక

పొలాలవైపు పయనమైపోయె
ఆ పశులకాపరికి
చేతికర్రలా నిలిచిపో
ఓ నా కవిత్వమా!

బిడ్డలు పుట్టిననాడె
పెద్ద చదువులకై నిచ్చెనలు వేసి
ముక్కుపచ్చలారని పసివారిని
సవతితల్లులవంటి హాస్టళ్ళకు
అప్పచెప్పి ఊపిరి పీల్చుకునే
కన్నతల్లితండ్రుల కళ్ళలో కదిలె
రాగరేఖవై నిలిచిపో!
ఓ నా కవిత్వమా!

ఆకలితో అలమటించె పసివానిని
సూర్యచంద్రులు తొంగిచూసె
చిరుగులపంచలో పరుండబెట్టి
పంచప్రాణాలు పసివానిపై నిలిపి
చీకటిలో పాచిపనికై
బయలుదేరే ఆ కన్నతల్లికి
దారిచూపె చేతిదీపానివై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

పాలుతాగే పసివానిని
పక్కన పరుండబెట్టి
మూడునాళ్ళ ముచ్చట
జీవితమని తెలిసినా
నోటికి నాలుగు మెతుకులు
అందించి ఆకలి తీర్చుకోవాలని
ముఖానికి రంగు పులుముకొని
నడుములు బిగించి
కాలికి గజ్జెకట్టె ఆ కన్నతల్లి
కడుపుమంటలను
చల్లార్చే స్వాతిచినుకువై కురిసిపో
ఓ నా కవిత్వమా!

ధనానికి దాసోహమై
చెడు అలవాట్లకు బానిసై
అగ్నిసాక్షిగా పెండ్లి ఆడిన భర్తే
పరాయివానికి భార్యను అప్పచెబితే
అవమానంతో అలమటించె
ఆ మానవతి కన్నీటిధారకు
ఆనకట్టవై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

కోడలంటే యింటికి బానిసయని
నెలలు నిండిన ఆ చూలింతరాలితో
ఇంటెడుపని చేయించే
అత్తరాపిడికి అడ్డుతగిలే
కొత్తచట్టానివై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

ధనానికి బానిసలై
సంపాదనలకు చేతులుచాచి
చంటివానికి పాలిచ్చే
బాలింతరాలిని బలవంతంగా
ఆఫీసుకు పంపి
నెలజీతానికై చేతులుచాచె
అత్తింటివారి చేతికి
కొరడాదెబ్బవై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

కట్నాలు చాలవని
లాంఛనాలు తక్కువని
అత్తా ఆడుబిడ్డల చేతిలో
రాపిడిపడే నవవధువులకు
ధైర్యరేఖవై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

భర్తతోనె బంధమని
అత్త మామ పనికిరానివారని
కుటుంబాలను చిందరవందర చేసె
ఆధునిక కోడళ్ళ ఆటకట్టే
ఆలోచనా కెరటానివై నిలిచిపో
ఓ నా కవిత్వమా!

అపురూప ఆనందసాగరానికి
ఆలవాలము అమ్మయని
పిల్లలకు శిక్షణాలయమని
తెలియచెప్పె అమ్మ అనురాగానికి
పట్టుకొమ్మవై నిలిచిపో
ఓ నా కవిత్వమా!
ఓ నా భావ స్వప్నమా!
ఓ నా హృదయ నేత్రమా!

# కవితా మూర్తి

నీలి గగనాన్ని అలరించె
ఏడు రంగుల హరివిల్లులా
మానవ హృదయాలను
అలరించె పూలవిల్లు కవి హృదయం.
కష్టజీవుల కన్నీళ్ళను కొలిచే
నిండు దోసిలి కవి హృదయం.
ప్రకృతిలోని అందాలను ఆనందాలను
చిత్రించె చిత్రపటం కలం.

భూత కాలాన్ని జ్ఞప్తికి తెచ్చి
వర్తమానాన్ని శాసిస్తూ
భవిష్యత్తును అరచేతిలో చూపె
ముందుచూపు కవి.
కవి ఒక ద్రష్ట.
కవి ఒక స్రష్ట.

ఋక్కులను రూపకల్పన చేసినా
సర్వశాస్త్ర పాండిత్యాలతో
కావ్యగానాలు చేసినా
వీరశృంగారాది నవరసాలు పండించి
ప్రబంధాలను పలికించినా
పరాయి పాలకుల గుండెలలో
కవితాకత్తులు దూసి
భారత స్వాతంత్ర్యోద్యమం నడిపించినా
దురాచారాల జుట్టుపట్టి
అత్యాచారాల ఆటపట్టించె
విశాల హృదయుడు
సంఘసంస్కారి కవి.
ప్రజాజీవన రథసారథుడు కవి.

ప్రకృతి కాంత అందాల
జిలిబిలి పైటల జెండాలు ఎగురవేసి
రసికుల హృదయాలలో
పన్నీరు చిలికి
హాస్యపు వడగళ్ల జల్లులతో
ముక్కోపుల ముఖాలలో
పకపక నవ్వులు రువ్వించే
మాంత్రికుడు కవి.
ఒక మెజీషియన్ కవి.

కోకిలపాటకు నగిషీలు చెక్కి
తారలకాంతులతో దీపాలు పెట్టి
వెన్నెల కిరణాలలో
అమృత జాలును పేర్చి
ఉభయ సంధ్యా రాగాలలో
అనురాగాలు పండించి
నదీతరగలపై చల్లగాలుల
పిల్లనగ్రోవులు పూరించి
అందరి హృదయాలను పూరించె
మృదంగ నాదం కవి.
ఒక మహా శిల్పి కవి.

సంకుచిత హృదయాలను సాగుచేసి
పచ్చని పరోపకారాల పైరుగ మార్చి
అధికారులనక అనధికారులనక
సామాన్యులనక దుండగులనక
అందరి నేరాలను, దోషాలను
కలుపు మొక్కలా పెరికివేసి
మానవత్వపు మంచిగంధపు గిన్నెలు
అందించె కర్షకుడు కవి.
నిత్య కృషీవలుడు కవి.

అందమైన అక్షరాలలో
తీయని మధువును చిలికి
కవితాపూలను పేర్చి
సంకలనాల మాలలు కూర్చె
పుష్పలావికుడు కవి.
ఒక మాలాకారుడు కవి.

మనిషి నైజాలను వెలికితీసి
పంచాంగంలా జీవితఫలితాలను
విప్పిచెప్పె నేర్పరి
మంచిచెడులను నిర్ణయించి
శిక్షణ యిచ్చే గురువు

అజ్ఞానపు చీకటి నుండి
విజ్ఞానపు వెలుగు నడిపించి
మానవత్వపు విలువలను
కొలిచే కాలమానం కవి.
ఒక పెద్ద బాలశిక్ష కవి.

స్వార్థం వదలి ధనాపేక్షలేక
నిస్వార్థపు ఊపిరితో
నిలిచే త్యాగమూర్తి
పరులకోసం నిత్యం తపించె
తపోమూర్తి కవి.
ఒక మహా తపోధనుడు కవి.

చైతన్యానికి చేయూత నిచ్చె చైతన్యమూర్తి
అందాల కవితా పుష్పాలు పూయించి
ఆనందాన్ని పంచె నిరాడంబరమూర్తి
సమస్యల మధ్యలో నిలబడి
ఉద్యమ శంఖం పూరించె ఉద్యోగి
దౌర్జన్యాల వీపులపై నిలచి
శాంతికపోతాలు ఎగురవేసె శాంతమూర్తి
విజయం సాధించెవరకు
వెనుకంజ వేయక
అధికారాలకు తలవగ్గక

తుపాకులకు భయపడక
కలాన్ని దించక పయనించే ధీరుడు కవి.
ఒక మహాప్రస్థానం కవి.

శరీరాలు తూట్లుపడినా
గుండెధైర్యం నిలిపె అక్షరమూర్తి
కుట్రలదారాలు
ఈర్ష్యల వలయాలు
చుట్టూ అల్లుకుంటున్నా
మనస్సుకు శస్త్రచికిత్స చేసె
నిపుణుడు కవి.
ఒక గొప్పవైద్యుడు కవి.

కవితల బాణాలు ఎక్కుపెట్టి
కవులు ధ్వజమెత్తితే
సింహకిశోరాలై గర్జిస్తే
వరదలై పొంగివస్తే
ఈ సిపాయి లెందుకు?
ఈ తుపాకు లెందుకు?
ఈ తీర్పులెందుకు?
ఈ శిక్షలెందుకు?
ఈ రక్షణలెందుకు?
కవి ఒక సిపాయిదండు
కలం ఒక తుపాకిగుండు!

(త్యాగరాజ గానసభ హైదరాబాదు, వంశీ ఆర్ట్ థియేటర్స్‌వారు ఏర్పాటు చేసిన డా॥ సి.నా రె. గారి జన్మదినోత్సవ వేడుకలో - 29-7-92).

# నాల్గవ దృశ్యం

ప్రపంచం మారిపోతున్నా
మానవ విలువలు తారుమారవుతున్నా
తరాలు నడిచిపోతున్నా
పుట్టగానె కెవ్వున ఏడ్చె
ఆ పసివాని కంఠంలో
ఎన్ని జీవిత సత్యాలు
తళుక్కుమంటాయో
సొంతకాళ్ళపై నిలబడి
ముందుకునడిచే మనిషికి తెలుసు కాని
ఆ పసివానికేమి తెలుసు?

మానాభిమానాలను వదలివేసి
కన్నతండ్రే అందరిముందు చేయిచాచి
లంచంకాళ్ళపై పైళ్ళు నడిపించే రకంకాదని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?

డొనేషన్లు కట్టలేకపోతే
చవుకబారు పాఠశాలల్లో
చేరి చదువుకోవాలని
అక్షరంముక్క వంటపట్టకపోయినా
ట్యూషన్ ఫీజులు చెల్లించాలని
తల్లితండ్రులు పిల్లల చదువులకై
ఉన్నది అమ్ముకొని అప్పులపాలవ్వాలని
ఆ పసివానికెలా తెలుసు?
పంతులు కొడితే
వెక్కి వెక్కి ఏడవడం తెలుసు
తోటివారు హేళన చేస్తే
బాధలో తలవంచడం తెలుసు
పుట్టిననాడె ఆ పసివానికేమి తెలుసు?

లంచాలతో ఆకాశమంత మేడలు కట్టి
వ్యాపారం పేరుతో ప్రజలను దోచుకుని
రాజకీయం పేరుతో దేశాన్ని అమ్ముకుతినే

పెద్ద అంతస్తుల భవనాలలో
కాలు కదపకుండా కార్లలో తిరిగె
ఆ పిల్లలకు తనకు తేడా తెలియక
నీతిపేరుతో తన తల్లితండ్రులు
బ్రతుకుల్లో నిప్పులు పోసుకున్నారని
ఆదర్శంపేరుతో అసమర్థులైనారని
పుట్టిన నాడె ఆ పసివానికెలా తెలుసు?

లంచాలు బెంచీలకిందనుంచి
కుంచాలతో చెల్లిస్తేకాని
ఉద్యోగాలు దొరకవని
రికమండేషన్లు లేనిదే
ఉన్నతపోస్టులలోకి ఎగబ్రాకలేరని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?

నువ్వెంతంటే నువ్వెంతని
తల్లీ తండ్రీ జుట్టూ జుట్టూ
పట్టుకొని కోర్టుకెక్కితే
తన బతుకు హాస్టల్లోనే తెల్లారాలని
పరాయివారితో తీపిమాటలు కలిపి
గాజుకళ్ళతో బతకాలని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?

వ్యసనాల వడిలో పెద్దలు
సంసారాన్ని వీధిని పడవేసి
నవనాగరికత మధ్యలో
తప్పతాగిన మైకంలో
ఉరితాడులా వేలాడతీస్తారని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?

స్వరాజ్య సముపార్జనకై
ఉదయరేఖల్లా అవతరించి
ఆదర్శంతో ఆకాశం ఎత్తుకు ఎదిగి
భరతమాత సంకెళ్ళను పగులగొట్టిన
రాజకీయ పార్టీలె
పదవులకోసం కుళ్ళు రాజకీయపుబురదలో
దేశాన్ని ముంచెత్తుతూ
స్వార్థం కురుపులా సలుపుతుంటె
జనాన్ని చిందరవందర చేసి
అల్లకల్లోలాలు సృష్టిస్తాయని
పదవులవెంటే పార్టీలు నడుస్తాయని
డబ్బువెంటే రాజకీయం నడుస్తుందని
హోదాలవెనకే కుర్చీలు మారుతాయని
గుండాయిజమే దేశాలు ఏలుతుందని
ఓటుహక్కే దుర్వినియోగమవుతుందని
భయాందోళనలతో ప్రజలు బతుకుతారని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?

నాయకులు నోరుపెంచితే
పెరిగేవి కొట్లాటలని
తరిగేవి న్యాయధర్మాలని
నాయకులు కాలుదువ్వితే
పెరిగేవి హింసలని
పడేవి బాంబులని
అమాయకులే ఆహుతని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?

విద్యతోపాటు వివేకం పెరగదని
ధనంతోపాటు పెరిగేది అహంకారమని
అవమానించేది తనవారినేనని
మూడునాళ్ళ ముచ్చట జీవితమని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?

తరతరాల మానవచరిత్ర మారదని
అమాయకులపైనే సవారి చేస్తుందని
పుట్టిననాడె ఆ పసివానికెలా తెలుసు?
పుట్టగానే గుక్కపట్టి ఏడవడం తెలుసు
తనకు కావలసినది నెరవేరేవరకు
ఆపకుండా ఏడవడం తెలుసు
ఏడుపు ఆయుధం పసివానికి
పట్టుదలే ఆయుధం మనిషికి!

# మ ని షి

తనచుట్టూ ఉన్న సమాజపు
భవనాల అంచులపై పరుగులు పెడుతూ
తనచుట్టూ ఉన్న ఆలోచనాబంధాలతో
ఆటలాడుతూ
పెనవేసుకున్న మమకారాలవడిలో
కేరింతాలాడుతూ
తనకొరకేకాక
తనచుట్టూ ఉన్నవారికై
ఆలోచించి ఆచరించె
ఉదారమూర్తి మనిషి.

మహాసంద్రాన్ని పోలిన హృదయంతో
పడిలేచే ఆలోచనాయుధాలతో
ఉవ్వెత్తున ఎగసిపడుతూ
కాలిక్రింద నేలనుతవ్వే
పరులప్రయత్నాల పెనుతుపానులో
నిశ్చలంగా నిలబడి
నిర్భయంగా పలికే
సాహసమూర్తి మనిషి.

పాటబాటలు గతాన్ని జ్ఞప్తికి తెస్తున్నా
గతుకుల బాటలు బొప్పిలు కట్టిస్తున్నా
కొత్తబాటలు చిమ్ముకుంటూ
నవ్యభావం పేర్చుకుంటూ
సాగిపోయే చైతన్యరూపం మనిషి.

అరిషడ్వర్గాల హాహాకారాలతో
పురుషార్థాల కొలిమిచిచ్చులలో
ప్రజ్వరిల్లే నూత్నరూపం
పడగలెత్తే నవ్యభావం మనిషి

వేయిగొంతులు తనలో ఉన్నా
పదివేల గొంతులు తన చుట్టూవున్నా
తీయనైన పిలుపులతో

నవ్యమార్గం తలుపు తట్టాలని
కొత్తదనం తొంగిచూడాలని
నవ్యగీతం పాడాలని
గొంతులు పూరించే నవ్యరాగం మనిషి.

స్వార్థం నోరుతెరిచి నిప్పులు కక్కుతుంటే
దేశప్రగతి చేతులుచాచి పిలుస్తుంటే
పరులకోసం పరుగులెత్తేవాడు
అందరిలో తానొక్కడై నిలిచేవాడు
అందరి భుజాలు తట్టి
ముందుకు నడిపేవాడు మనిషి.

అజ్ఞానం చుట్టూ ఆవరించివున్నా
విజ్ఞానపు దీపం వెలిగించాలని
ఆ వెలుగువెంట అందరిని నడిపించాలని
ఆటంకాల అగ్నిశిఖలను ఆర్పుకుంటూ
అవరోధాల పెనుతుపానులు దాటుకుంటూ
ఫలోన్ముఖుడయ్యేవాడు మనిషి.

బద్ధకం సోమరితనాన్ని మప్పుతున్నా
అవసరం చేతనాన్ని మేల్కొలుపుతుంటె

ఎదురువీచే పరిహాసాలను తోసుకుంటూ
దారిపొడుగునా ప్రయత్నాన్ని విత్తుకుంటూ
జీవితాన్ని సాగుచేసేవాడు మనిషి.

ఎన్ని కళలు నేర్చినా
ఎంత రాగం నింపుకున్నా
ఎన్ని పదవులు చేపట్టినా
మరో మనిషి సుతిమెత్తని
పలుకుల మునివేళ్ళతో
తన హృదయవీణ మీటాలని
కొత్త రాగాలు పలికించాలని
తపించే కళాతపస్వి మనిషి

తన చుట్టూ ఎగసిపడే ధూళిరేణువులతో
బరువెక్కి తన కనురెప్పలను
ఏ చల్లని హృదయతరంగమో విచ్చేసి
తన కనురెప్పలపై కప్పిన
ధూళిని తొలగించి
తన జ్ఞానేంద్రియాన్ని మేలుకొలపాలని
విశ్వగీతం ఆలపించాలని
తపించే గీతం మనిషి.

నిత్యం తన ఆలోచనకు
కొత్త నగిషీలు చెక్కాలని
కొత్త సుగంధాలు మోయించాలని
నిత్యం పరిశోధన గావించె
పరిశోధకుడు మనిషి.

ఎన్ని జీవులు పుక్కిలించి ఉమిసినా
తరగని సముద్రజలంలా
ఎందరు నమిలి మింగినా
తరగని గుప్పెడు హృదయంతో
ఆలోచనాతెరచాపలను ఎత్తి
ఈ విశాల ప్రపంచసంద్రాన్ని
అవలీలగా దాటాలని
ప్రయత్నించేవాడు మనిషి.

ఆపదకు కరిగినా
కోపానికి పెరిగినా
సంతోషానికి ఉబికినా
స్థానం విడువని హృదయంలో
ఆలోచనాబాణాలు పేర్చుకుంటూ
ఆకాశంలో నక్షత్రంలా వెలిగేవాడు
లోహాల్లో బంగారంలా మెరిసేవాడు మనిషి

మానాభిమానాలను
సంధించే ఆరడుగుల మనిషి
అవమానం ఎదురైతే
వామనుడై ఆకాశం ఎత్తుకు పెరిగేవాడు
ఏ ఆయుధాలు చేత లేకుండానే
ఎత్తుకు పై ఎత్తులు వేస్తూ
దేశాలు ఏలేవాడు
ప్రగతిమార్గం పేర్చేవాడు మనిషి.

పట్టుదలే ప్రాణంగా
ప్రయత్నమే ఊపిరిగా
చైతన్యమే మేలుకొలుపుగా
అవయవాలె పరికరాలుగా
పనిచేసే రూపం మనిషి
అందుకే సూర్యునిలా నిత్యచేతనుడు
చంద్రునిలా అమృతవర్షుడు మనిషి.

("వెలుగు వచ్చేవేళ" కవితాసంకలం నుండి.)

## అయిదవ దృశ్యం

# నా రక్తంలో రక్తం కాశ్మీరం

హిమాలయాలు పుట్టిననాడె
ఈ నేలలో గంగ పారకముందే
కన్యాకుమారి పాదపీఠమైతే
భారతమాతకు రత్నకిరీటం కాశ్మీరం
అంగ వంగ కళింగ దేశాలలో
కాశ్మీరం స్వర్గధామం
ఈ భారతావనికి.

పూలపడవల్లో కొలనులన్నీ చుట్టాలన్నీ
అందమైన ఆరామాలన్నీ చూడాలన్నీ
కళ్ళనిండా సుందరదృశ్యాలు నింపాలనీ
హృదయమంతా ఆనందంతో నిండాలని
ఎందరు విద్యార్థులు!
ఎందరు కొత్తదంపతులు!
ఎందరు దేశ విదేశీయులు
ఈ కాశ్మీరదేశంలో నడిచారో
ఆ అడుగులు కొలిచి ఎవరు చెప్పగలరు?
సర్వభాషలవారు
కాశ్మీరానికి అతిథులైతే
సర్వభాషల సమ్మేళనం
ఈ కాశ్మీరం కాదా?
అన్ని మతాలవారు ఆ నేలను కొలుస్తుంటే
అందాలను కన్నులపండువుగా చూస్తుంటే
సర్వమత సామరస్యానికి
పాలవెల్లి కాదా కాశ్మీరం?
మేలిమిబంగారమువంటి మనుష్యులతో
ఎర్రగులాబీలవంటి యాపిల్ పళ్ళతో

నిలువెత్తు లోయల పచ్చదనం తామయితే
ప్రపంచానికే అపురూపం కాశ్మీరం
కొందరి కళ్ళల్లో పచ్చకామెర్లు
కొందరి గుండెల్లో గునపు పోటులు
కొందరికంటె ఈర్ష్యే ముందుపుడితే
కొందరి కంటె అహంకారమే
ముందు పుడుతుంది.
నోరుంటె రాజ్యాలు దొరికే
రోజులు కావివి
ముక్కలు చెక్కలుగా
చేయబడిన భారతం
అఖండ భారతమైన రోజులివి.
జనాభాతో నిండుగసాగె భారతంలో
అందరి కంఠాలు ఏకమైతే
ఏ గొంతులైన పడిపోవలసిందే
చేతిలో అణ్వాస్త్రముందని
కాలు ముందుకు వేస్తే
ఈ దేశంలోని ముళ్ళకంచెలే
మూడవ కన్ను తెరుస్తాయి
చేత ఏ ఆయుధం లేకుండానే

గావంచాతో గాంధీతాత
ముందుకు అడుగులు వేస్తే
ఆసేతు కాశ్మీరం వెంటనడిచి
పరాయి పాలకుల గుండెలను
గడగడలాడించిన దేశమిది?
నిన్న మొన్న పుట్టిన బెత్తెడు
దేశానికేమి తెలుసు
ఈ కాశ్మీరు దేశ చరిత్ర?
వేదకాలంలోనె వెలసిన దేశమిది!
పురాణేతిహాసాలలో
పేరుపొందిన దేశం కాశ్మీరం
ఈ దేశంలో పుట్టిన
పసికూనకు కూడా తెలుసు
ఈ కాశ్మీరం మనదని!
ఈ దేశంలో తిరిగి ప్రతి మనిషికి తెలుసు
కాశ్మీరమునుండి కన్యాకుమారివరకు
వీచే గాలి ఒక్కటేనని
కురిసే మేఘం
కాలిచే ఆకాశం

తాగేనీరు ఒక్కటేనని
వికసించే విజ్ఞానం
పెరిగే మానవత్వం
అందరిలో ఒక్కటేనని
స్వార్థం పెరిగి పెరిగి
అన్యాయాలు అక్రమాలు చేయిస్తున్న
పరులకోసం బతికే
తీపి మనసులు కొన్నుంటాయి
ఈ దేశచరిత్రను తిరగేస్తే
నగ్నసత్యాలై కనిపిస్తాయి
కొన్ని జీవితసత్యాలు
కొందరి మనుష్యుల హృదయాలు
మహాసంద్రాలై మోషిస్తాయని
ఎందరికో ఆదర్శమై నిలుస్తాయని
గత చరిత్రే తార్కాణం
ఆరు ఋతువులలో
వసంత మొక్కటే
ఎల్లవేళల కొలుస్తుంటే
కొత్త పెళ్ళికూతురిలా
కలకల్లాడే కాశ్మీరాన్ని

స్వార్థంతో కుట్రలువన్ని
కాలనాగులై పడగలువిప్పి
బుసలు కొడుతూ
విషం కక్కుతుంటె
మసీదులు, దేవళాలె
ఆటంకవాదులకు
ఆలయాలైతే
ఈ దేశంలో పుట్టిన
ఏ మనిషి సహించగలడు
ఈ అవమానం?
ప్రజాశ్రేయస్సును కోరే
ప్రజా కవులారా!
నరనరాలలో దేశభక్తి ప్రజ్వరిల్లిన
ఈ దేశం పుట్టిననాడె
కాశ్మీరం పుట్టినదని
దేశసమైక్యతే మా లక్ష్యమని
పెరవాని ఆటలిక సాగవని
మా హృదయంలో హృదయం కాశ్మీరమని
మా రక్తంలో రక్తం కాశ్మీరమని
మీ కలాలు పలికించండి
మీ గళాలువిప్పి చాటండి!

(15-8-94 నాడు రాష్ట్రీయ కాశ్మీరుమంచ్ కవిసమ్మేళానంతరం చదివిన కవిత).

# ఆరవ దృశ్యం

# శిశిరానికి శ్రీమంతం

ఆరు ఋతువుల ఇంద్రధనుస్సులో
సాగిపోయె అనుభవాల పుట్ట
సంవత్సరానికి ఆఖరి మజిలీ శిశిరం
యౌవ్వనపు ఆనంద డోలికల
బాధ్యతల ఒడిలో పెరిగిన జీవితాన్ని
చేజారిపోతున్న అనుభవాల సుఖాలను
పండిన జీవితాన్ని పండని కోరికలను
తులతూగిస్తూ

మనసును ప్రమిదలా
జ్ఞాపకాలను ఒత్తిలా వెలిగించె
కాలం శిశిరం.

లేత చిగుళ్ళ సందడులు
పూల వాసనల ఘుమఘుమలు లేకపోయినా
ఆకులు రాల్చిన కొమ్మల వేళ్ళతో
పచ్చదనాన్ని పండించాలని
తపించె తపస్వి శిశిరం.

పొంగి పొరలె నదుల నిండుదనాలు
జల్లు జల్లున కురిసె జడివానల సందడులు
అదరించె మేఘమాలికల గర్జనలు లేకపోయినా
పెరిగె ఎండల చురుకుదనంతో
తెల్లని మల్లెల ఘుమఘుమలతో
కంఠమెత్తే సన్నాయివంటి
కోకిల గొంతు సవరింపులతో
మదతలు పడని ఆలోచనతో
సాగిపోయె జీవితకావ్యం శిశిరం.

వరదల బాధలతో
గాలివానల బెదదలతో

కరడుగట్టిన జీవితానుభవాలతో
కార్చే కన్నీళ్ళ చారికలతో
సాగిపోయే జీవిత సత్యాలను పరచి
రాబోయే ఎండల వేడికి
ఎదురు వెళ్ళే దృఢ నిశ్చయంతో
నిశ్చలంగా నిలబడి
మలిజన్మకై నిర్మలంగా
తపస్సు చేసుకునే
తపస్విని శిశిరం

చల్లని తేట నీరు చుట్టూఉన్నా
నీటిచుక్కలు నోటి కందక
దాహంతో కొట్టుమిట్లాడే ప్రాణికోటిని
ఓదార్చే చల్లనినీటి ప్రవాహం శిశిరం

ఆకులు ఎండి ఫలించని కోరికల్లా
నేల రాలిపోతున్నా
కొత్త పెళ్ళికూతురులా
అడుగుపెట్టే వసంతంవైపు
చేతులు చాచి చూపించే
విశాల హృదయం శిశిరం

వేసవి కరంటుకోతలతో
చెమటలు కక్కుతున్నా
రెండు దినాలకు కూడా మంచినీటితో
బిందెలు నిండక అల్లాడిపోతున్న
ఆర్తజనావళికి
స్వాతిజల్లులు కురిపించాలని
ప్రయత్నించె శ్రమశక్తి శిశిరం

శిశిరం వసంతానికి ఆది
జీవితం కప్పుకున్న ఆర్భాటాల
ముసుగు తొలగించినప్పుడు
పాత ఆలోచనలకు స్వస్తిచెప్పినప్పుడు
శిశిరంలా వసంతంవైపు
కదులుతాడు మనిషి
అందుకే మనిషిలోని మానవత్వం శిశిరం
మనిషిలోని ప్రయత్నం శిశిరం
శిశిరాన్ని చిత్రించేవాడు
శిశిరానికి శ్రీమంతం చేసేవాడు కవి.

(ఆల్ ఇండియా పొయట్సు కాన్ఫరెన్స్, హైదరాబాదులో చదివిన కవిత).

# నేత్రగోళాలు

అనంతమైన ఈ లోకంలో
నిశితంగా వీక్షించాలని
నిరంతరం నా నేత్రాలు
విప్పారే ఉంటాయి
నా నేత్రగోళాలనుంచి
దూసుకువచ్చే నా చూపులు
అనుక్షణం ఈ సువిశాల ప్రపంచంలో
స్వేచ్ఛావిహంగాలై
విహరిస్తూనే ఉంటాయి.

నా నేత్రాల కిరువైపులా
ద్వారపాలకులై
నాకంటే సంరక్షణకు
పూనుకున్న రెప్పలద్వయం
అదురుతూ బెదురుతూ
నా నేత్రాలను కప్పివేస్తూ
కాపాడాలని తాపత్రాయపడుతున్నా
నా చూపులు ముడుచుకుచే
మూలకూర్చుని మూల్గలేవు.
అలసట ఎరుగక
ఆకాశంలో విహరించక
భూమార్గం పట్టి
దూసుకుపోతూ ఉంటాయి
నీ చూపు మేరకు అందిన
ఈ విశాల లోకాన్ని
సువిశాలంగా పెంచాలని
పలు రకాలుగా
పాటుపడుతూ ఉంటాయి.

న్యాయం చేతిలో
మనిషి నలిగి నశించిపోతున్నప్పుడు
నా నేత్రాలు అగ్నిగోళాలై
నిప్పులు ఎగజిమ్ముతాయి
బాధాతప్తజీవుల కంటినుండి
కారే కన్నీళ్ళు కడిగివేయాలని
నా చూపులె కరిగి కరిగి
వరదలై పారుతాయి
నా చూపులు సింధునదికంటే లోతైన
గంగకంటె పొడవైనవి
నా చూపులు లోకానుభవంతో
పదును పెట్టుకుని
విరబూసిన రత్నాలై
ప్రజ్వరిల్లుతాయి
నా నేత్రవైశాల్యం
అరంగుళమైన
నా చూపు వైశాల్యం
ఈ లోకాన్ని కొలిచె ఆకాశమంతా

నా చూపె నాకు ప్రాణం
నా చూపే నాకు జ్ఞానం
నా చూపులను ప్రసాదించే
నా నేత్రాలే
నా గమ్యానికి దారులు చూపె
సూర్యచంద్ర గోళాలు

('మానవతా శిఖరం' - కవితాసంకలం నుండి)

# ఓ మహిళా! ఎటు నీ పయనం

అగాధ జలకూపంలో
పడుండె బావురుకప్పలా గాక
అందాలు విరజిమ్మే
రంగు రంగుల పట్టురెక్కలతో
పరిమళించే పూవు పూవునూ పలకరిస్తూ
స్వేచ్ఛగా ఎగిరే సీతాకోకచిలుకలా
మంచి మనసులను పలకరిస్తూ
ఆత్మీయతను పంచుకుంటూ

రాగద్వేషాల వలలో కొట్టుమిట్టాడే
మనస్సులను సరిచేసుకుంటూ
విజ్ఞాన వీచికల నడుమ
సంస్కార తోరణాల పందిరిలో
కష్టనష్టాల తుఫానులను తట్టుకుంటూ
నవ్య మార్గంలో నడిచిపోవాలనుకునే
ఓ మహిళా!

కొమ్మలతో రెమ్మలతో
అల్లుకుపోతున్న
ఈ సరికొత్త నాగరికతలో
ఎటు నీ పయనం?

నిద్రమత్తును వేడి కిరణాలతో కరగిస్తూ
లోకమంతా వెలుగులు నింపుకుంటూ
సాగె సూర్యునిలా
చీకటిని చీల్చుకుంటూ
వెన్నెల పంచుకుంటూ
పయనించే చంద్రునిలా

ఈ లోకంలో వెలిగిపోవాలని
హృదినే గుడిగా
కార్యదీక్షాజ్యోతిగా
ఆశయమే నైవేద్యంగా
సామరస్యాన్ని పాదుకొల్పి
నీవు నీవుగా ఆలోచిస్తూ
నీ కాళ్ళపై నీవు నడుస్తూ
వలచి వరించిన ప్రియునితో
మదిని కుదిపే పిల్లపాపలతో
చుట్టూ ఉన్న సమాజానికి చేయూతగా
విశాల దేశానికి వెన్నుపూసగా
జీవితం గడపాలనుకున్న
ఓ మహిళా!
ఈ నవ్య నాగరికతా ప్రపంచంలో
నీ పయనం ఎటు?

ఊదుతున్న పురాణగాధల ఊపిరితిత్తుల్లో
ఏంగిలివిస్తరి నాకే వ్రతధర్మంలో

భర్త పెట్టే ఆదరింపులతో
అత్త పెట్టే ఆకలి బాధలతో
గంతలు కట్టిన గానుగెద్దులా
నాలుగు గోడల మధ్య తిరుగుతూ
ఇంటిగుట్టు వీధి కెక్కకుండా
నిండు గంగాళంలా నిలబడే
ఓ మహిళా!
నీ వెక్కడ? నీ బతుకెక్కడ?
ఈ వ్రతధర్మాల బంధంలో
నీ పయన మెక్కడ?

నవ్య నాగరికతా సుడిగుండాలలో
కొట్టుకుపోయె ఎండుటాకులా
కాలు నిలదొక్కుకొనలేకపోయినా
తమని తాము ఉద్ధరించుకొని
ప్రపంచాన్ని కాపాడాలని
కన్నపిల్లలను కోర్టులో నిలబెట్టి
పంతాలతో చెరి ఒక వైపు

తల్లితండ్రులే పట్టుపట్టి లాగుతుంటే
భావిపౌరుల బతుకులకు
ప్రేమనిలయాలెక్కడ?
అనురాగధారల స్నానాలెక్కడ?
వారి జీవితాలకు వెలుగురేఖలెక్కడ?

అసలు నీ బతుకెక్కడ?
మాతృత్వమే నీకు బంధమా?
నీ అందమె నీకు శాపమా?
కారడవుల్లో మోడుగానో
గుట్టగానో, మెట్టగానో
తుమ్మతోపుల్లో ముళ్ళ కంపగానో
పడివుంటే చాలనుకునే
పాతరాతి యుగానికి
రంగులు పులిమిన
సరికొత్త నవ్యనాగరికతలో
ఓ మహిళా!
ఎటు నీ పయనం?

ఈ నవ్యవైజ్ఞానిక పథంలో

లైంగిక స్వేచ్ఛే సర్వస్వేచ్ఛలకు
మూలాధారమైతే
ఈ పెరిగిన సమాజం
ఈ పెరుగుతున్న నాగరికత
పరిమళించె సంస్కార భాండాగారం
తలదాచుకోడానికి తావెక్కడ?
సమాజమంటె పశువుల సంతలు కావు
మహిళలంటె మట్టిముద్దల పిడకలు కారు
పెనవేసిన అభిమానాలు
అల్లుకున్న ఆత్మీయతలు
వట్టి బూటకాలేనా?
సరదాలు సంతోషాలు
పట్టి నాటకాలేనా?
గతానికి గంతలు కట్టే
ప్రగతికి సమాధి కట్టే
తుఫాను గాలులకు అంతమెక్కడ?

విజ్ఞాన సుగంధ వీచికల నడుమ
సంస్కార తోరణాల పందిరిలో
నవ్యమార్గాల నడుమ
నడిచిపోవాలనుకునే
ఓ మహిళా!
ఎటు నీ పయనం?

# ఏడవ దృశ్యం

ఊరుముల బాండు మేళాలతో
మెరుపుల మెర్క్యూరీ దీపాలతో
సూర్యచంద్రులను నిలువుటద్దాలలో
అందాలు కొలుచుకుంటూ
నక్షత్రాల సిరిమల్లెలను
జడనిండా తురుముకొని
చల్లనిగాలి కెరటాల లోయలు
పల్లకి మోస్తుంటే
కొత్త పెళ్ళికూతురిల
ఆషాఢ, శ్రావణ, భాద్రపద శుభవేళల్లో

ఒళ్ళు తెలియక వర్షం గుమ్మరించే
ఓ మేఘమా! స్వేచ్ఛాపతంగమా!
నిత్యనూతన చైతన్య రాశీభూతమా!

సంకుచిత భావాలకు
మురికినీటిలా ప్రవహించే
మోసాలకు దూరంగా
స్వేచ్ఛాగగనంలో పయనిస్తూ
నా భారత భూమిని కొలుచుకుంటూ
ఆకాశమంత విశాలహృదయంలో
కన్యాకుమారినుండి కైలాసశిఖరంవరకు
అలసట యెరుగక
ఆటంకం తెలియక
అతితేలికగా పయనించే
ఓ మేఘమా! ఓ ధూమకేతనమా!

కోపంతో నీవు ఆకాశంలో
అడుగుపెట్టకపోతే
ఈ భూమంతా బీటలు వారదా?
ఈ జీవరాసులన్నీ అల్లాడిపోవా?
ఈ పైరులన్నీ వెళవెళమనవా?
ఈ నేలపై పచ్చదనమే హరించిపోదా?
శాస్త్రజ్ఞానం అదుపు చేయలేని
విజ్ఞాన రూపం నీది!

ఆడుకుంటూ పాడుకుంటూ
భూమాతకు పట్టిన నీలి చాందినిలా
ప్రకృతిమాతకు పట్టిన నల్లని గొడుగులా
కాలంవెంట కదిలే
ఓ మేఘమా!

దిశలు మార్చుకుంటూ
అవసరమెరిగి రంగులు మార్చుకుంటూ
గంభీరుడవై గర్జనలు చేసుకుంటూ
విజయయాత్రా ఘనచక్రవర్తివై
శరీరం కరిగిపోతున్నా
రూపం నీరై పారుతున్నా
కర్తవ్యం మరిచిపోక
పరోపకారమే ధ్యేయంగా
శరీరాన్ని అర్పించే ఓ మేఘమా!

జీవరాసులకు ప్రాణం నిలిపే
అపరబ్రహ్మవై
ప్రకృతికి చికిత్సాశిబిరానివై
సహస్రఫణిజాలంతో
భూమిని కొలిచే ఆదిశేషుని అవతారంలా
ప్రకృతికి అందాలు సవరించే
శిల్పకళామూర్తిలా

కొండలను గుట్టలను
విడిది చేసుకుంటూ
ప్రపంచానికే ఆదర్శరూపానివై
ధర్మనిరతివై
వర్షాధిపతివై
నీవు పయనించే త్రోవలలో
కారడవులు పెంచుకుంటూ
ఊరూర పచ్చజెండాలు
ఎగురవేసుకుంటూ
కరువు కాటకాలకు
యమపాశానివై
మంచినీటికి ఆకాశధారవై
మా నేలకు వచ్చిపోయే
ఓ మేఘమా! ఓ అథితి దేవతా!

కాళిదాసు కవనంలో
సాహితీ కేతనానివై
వేద వేదాంగాలలో
అర్జునకు పర్జన్యాస్త్రానివై
యుగయుగాల ప్రతినిధివై
తరతరాల ప్రాణదాతవై

ప్రపంచ జీవకోటిని
ప్రజ్వలింపచేసే
ఔషధజ్యోతివై
అఖండదీపాల్లా వెలిగే
సూర్యచంద్రుల కాంతిని
ఆపగల దీశాలివై
ఆకాశంలో సంచరించే
ఓ విప్లవ సింహమా!
ఓ విజయ శంఖమా!

అకాలంలో విచ్చేసి నా ప్రజలను
భయభ్రాంతులను చేయక
సకాలంలో మిత్రునిలా విచ్చేసి
వాడవాడలను పలకరిస్తూ
వీధివీధినీ తడుపుకుంటూ
మేడలనక మిద్దెలనక
పూరిపంచలనక
పలకరిస్తూ పయనించే
ఓ స్వచ్ఛంద రూపమా!

మహాత్ముల విశాలహృదయంతో
మహర్షుల నిదానవైఖరితో
నా భారతభూమిని తడుపుకుంటూ
పచ్చదనం విత్తుకుంటూ
పాడిపంటలు నింపుకుంటూ

లోకానికి అభ్యుదయానివై
శుకపికాదులను పాడించుకుంటూ
మయూరాదులను ఆడించుకుంటూ
చిటపట చినుకులతో
చిన్నారులను పకపక నవ్విస్తూ
వడగళ్ళ వానలతో కవ్విస్తూ
సన్నని జడివానలతో
రోగులను, అనాధులను పలకరిస్తూ
కుంభవృష్టులతో
చెరువులను, నదీనదాలను నింపుకుంటూ
సాగిపోయే ఓ మేఘమా!

బీటలువారిన భూమిపగుళ్ళలో
మొలకలు రేకెత్తించి
నవధాన్యాలు పండించే మాంత్రికునిలా
కులతత్త్వాలు
మతమౌఢ్యాలు
తెలియని ఆకాశంలో
మారణాయుధాలు
దౌర్జన్యాలు లేని బాటలో
మహామనీషిలా
ఆశయాల పౌరునిగా

# ఉపసంహారం

ఉషోదయవేళలో
విచ్చుకుంటున్న మానవత్వపు
పూలరథంపై వూరేగే
స్వతంత్ర దేశాలన్నీ
ఏక కంఠంతో ఆలపించాలి
విశ్వమానవ కళ్యాణగీతం.
ఆలపించక ఆలస్యం చేస్తుంటే
ప్రయత్నాలతోనే కాలం గడిచిపోతుంటే
అభిప్రాయభేదాలతో

అలమటిస్తుంటే
అనర్థాలు జరగక ఆగిపోతాయా?
స్వార్థపు పునాదులనుంచి
అహంకారపు సందులనుంచి
హృదయాలను దొలిచివేస్తూ
దూసుకువస్తున్నాయి అణుబాంబులు
ఆటవిక శక్తులు

యుద్ధ సన్నాహాలు
సరిహద్దు రక్షణలు
మారుమోగుతున్నాయి.
అవసరపు కార్యక్రమాలనే
వెనక్కు నెడుతున్నాయి
కోట్ల ధనమంతా బూడిదపాలై
నోటికందే కూడు
ఏటిపాలవుతోంది

పెంచుకున్న నాగరికతతో
పేర్చుకుంటున్న విజ్ఞానశాస్త్ర
పరిమళాల ఘుమఘుమలతో
ప్రపంచ దేశాలు పల్లవిస్తే
అందరికీ కనువిందే కదా!

చిన్న దేశాలని చిన్న చూపుతో
పేద దేశాలని చీదరిస్తూ
యుద్ధభేరీలు మ్రోగిస్తూ
దండయాత్రలు చేస్తుందే
ముందడుగు వేసే
మానవ ప్రయత్నాలన్నీ
బూడిదపాలేగా!

వెనుకబడిన జనం మరింత వెనుకబడి
తిండిగింజలు లేక కట్టే గుడ్డలేక
నిలువ నీడలేక
చలిగాలుల్లో అల్లాడిపోరా?

యువతరమంతా ఏకమై
దేశసరిహద్దులు చెరుపుకుంటూ
చేతులు కలిపి
స్నేహాలు నిలిపి
హృదయ వైశాల్యం పెంచుకుంటూ
నా తన భేదాలు వదిలి
ప్రపంచపౌరులై
అందరితో కలిసి అడుగులు వేస్తున్నారు
ప్రపంచ కుటుంబ విద్యార్థులుగా.

సరికొత్త నాగరికతను సృష్టిస్తున్నారు
మానవ మనుగడకే
నవ్యమార్గాలు పేరుస్తున్నారు.

ఇంకా కొందరు ఛాందసులై
కుల మత భేదాల సరిహద్దులు గీసి
వంగి వంగి సలాములు చేయిస్తున్నారు.
పార్టీ గూండా రాజకీయాలతో
స్వార్థపు వలలు విసురుతూ
హింసను రెచ్చగొడుతూ.
భయాందోళలను ఎగజిమ్ముతూ
పార్టీ ఆశయాలనే వమ్ము చేస్తుంటే
నిజాయితీ, నిస్వార్థం
ఈ విశాల భూగోళంలో
తలదాచుకోడానికి తావులేక
తల్లడిల్లి విలపిస్తూ
గుండె గుండెను వెతుకుతు
మాట మాటను పరిశీలిస్తూ
చేత చేతను కొలుస్తూ
దేశమంతా తిరుగుతున్నాయి.
ప్రపంచమంతా పరుగులెత్తుతున్నాయి.

పెరుగుతున్న విద్యాబలం
పెంచుకుంటున్న శాస్త్రబలం
కుస్తీలు పట్టలేక
ముందు వెనుకలకు ఊగుతుంటే
కాగితపు పడవల్లా మునుగుతుంటే
దేశప్రగతికి దారి ఎక్కడ?
ప్రపంచ ప్రగతికి మార్గమెక్కడ?

స్వతంత్ర దేశంలో సామాన్యులే
దేశానికి నేతలైతే
పాలించే పౌరునకు
ఓటువేసే పౌరునకు
నిప్పులాంటి నిజాయితీ
వెంటనంటి నడవాలీ
మచ్చలేని దేశభక్తి
మహావృక్షంలా పెరగాలి.
మనిషి హృదయంలో
పన్నీరు చిలికే దేశభక్తి
దేశమంతా అలికి ముగ్గులు వేయాలి.
పచ్చతోరణాలు కట్టి
ఎల్లవేళలా పండుగ జరపాలి.

మనుష్యులందరిని
ఏకం చేసే దేశభక్తి
దురాచనల కౌగిలిలో
నలిగి ముడుచుపోకుండా నిలపాలి
మనిషి హృదయంలో
దేశభక్తి నిండుగా పరిమళించిననాడె
స్వతంత్రదేశానికి రక్ష.

'సరిగమ పదనిస' అంటూ
సప్తస్వర సంగీతం
ప్రజల హృదయరాగాన్ని పలికిస్తూ
మోడుబారిన జీవితాలతో
పండువెన్నెలలు కురిపించి
నూత్నరాగాలు ఆలపించాలి.

— —

స్వరాజ్యం వచ్చి అర్ధ శతాబ్దమవుతున్న
అణగివున్న సమాజం
ఇంకా అణగారిపోతూనె ఉంది.
నిద్రలేవని సమాజం
నిద్రపోతూనె ఉంది.
పెరిగిపోతున్న అశ్లీలతను
ఆపకపోతే సమాజానికి
ప్రగతి ఎక్కడ?
దేశానికి క్షేమమెక్కడ?

రక్తసిక్తమైన మానవశక్తి
రెక్కలుతెగిన పక్షిలా
కువ కువ మంటుంటె
నవ నవోన్మేషమైన
భావితరానికి వెలుగు ఎక్కడ?
మానవులంతా ఏకమై
ఉదయ సంధ్యారాగ మాలపిస్తూ
విశ్వమానవ కళ్యాణగీతికి
శృతులు సరిచేయాలి.

